

చేతి తొడుగు
ఉక్రేనియన్ జానపద కథ



బాగా చలిగా ఉన్న రోజు. ఒక అబ్బాయి అడవిలో కట్టెపుల్లలు ఏరుతున్నాడు.

“ఉత్తరంవైపు నుంచి చలిగాలులు వీస్తున్నాయి. చలి ఇంకా పెరుగుతుంది,” నాయనమ్మ చెప్పింది. “ఇల్లు వెచ్చగా ఉండాలంటే నెగడు మండుతూ ఉండాలి. కాబట్టి చాలా కట్టెపుల్లలు కావాలి.”



తన మంచు బండి నిండేదాకా ఆ అబ్బాయి కట్టెపుల్లలు ఏరాడు. చివరి కట్టెపుల్లను బండిలో వేస్తుండగా అతడి చేతి తొడుగు ఒకటి జారిపోయింది.

చలి కాలంలో ఎవరైనా అంత అజాగ్రత్తగా ఎలా ఉంటారంటే నేను సమాధానం చెప్పలేను. మా బామ్మ నాకు ఈ కథ ఇలాగే చెప్పింది.

మంచుబండి లాక్కుంటూ ఆ అబ్బాయి వెళ్లిపోయాడు. అతడి చేతితొడుగు మంచులో ఉండిపోయింది.



అంతలో అక్కడికి ఒక చిట్టెలుక పరిగెత్తుకుంటూ వచ్చింది. దానికి బాగా చలిపెడుతోంది. చేతితొడుగు కనపడేసరికి అది ఎగిరి దాంట్లోకి దూరింది. ఆ చేతితొడుగు చాలా మెత్తగా, వెచ్చగా ఉంది. ఎలుకకి లోపల హాయిగా ఉంది.





అంతలో అక్కడికి వణుకుతూ ఒక పచ్చ కప్ప వచ్చింది.

“లోపల ఎవరైనా ఉన్నారా?” అంటూ అడిగింది.

“నేను ఒక్కదానినే ఉన్నాను,” అంటూ ఎలుక దానిని లోపలికి రమ్మంది.











ఎలుక, కప్ప చేతితొడుగు లోపల వెచ్చగా ఉండగా ఒక గుడ్లగూబ వచ్చింది. “నేను కూడా లోపలికి రావచ్చా?” అది అడిగింది.

“రావచ్చు, కానీ మంచిగా ఉండాలి,” అంది చిట్టెలుక. గుడ్లగూబని అంత దగ్గరగా చూడటంతో దానికి కంగారుగా ఉంది. “లోపల అంత చోటు లేదు, కాబట్టి కదలక, మెదలక ఉండాలి,” అంది పచ్చకప్ప.



కొంచెం సేపటికి అటుగా వెళుతున్న ఒక కుందేలు వచ్చింది. "ఈ వెచ్చటి చేతితొడుగులో నాకు కూడా కొంచెం చోటు ఉందా?" కుందేలు అడిగింది, "బయట ఈ రోజు బాగా చలిగా ఉంది."

"లోపల అంత చోటు లేదు," ఎలుక, కప్ప, గుడ్లగూబ చెప్పాయి, "కానీ అలాగే సర్దుకుందాం రా."





కుందేలు కుదురుకుందో లేదో అక్కడికి ఒక నక్క వచ్చింది. ఎంతో కష్టపడి అది కూడా లోపల సర్దుకుంది.

తాను అంత ఉదారంగా ఉండాల్సింది కాదు అనుకుంది ఎలుక. అయితే, బయట అంత చలిగా ఉంటే ఎవరైనా ఏం చేస్తారు?



అది చాలదన్నట్లు అక్కడికి ఒక పెద్ద తోడేలు వచ్చింది. అది కూడా లోపలికి వస్తానన్నది.

"ఇంతమందిమి లోపల ఎట్లా పడతామో నాకు అర్థం కావటం లేదు," ఎలుక అంది, "అయినా ప్రయత్నిద్దాం."

అన్ని జంతువులు కొంచెం, కొంచెం సర్దుకున్నాయి. తోడేలుకి కూడా లోపల చోటు దొరికింది.

ఇప్పుడు లోపల ఇరుకుగా ఉంది, అయితే వెచ్చగా కూడా ఉంది.





అందరూ హాయిగా ఉన్నారనుకుంటుండగా ఒక అడవి పంది వచ్చింది. లోపలికి రావాలని అది ఆత్రంతో ఉంది.

“ఓరి నాయనో!” చేతి తొడుగు ఆపాటికే అక్కడక్కడా పిగిలిపోతుండటంతో ఎలుక అరిచింది, “లోపల చోటు లేదు.”



“నేను ఒద్దికగా ఉంటాను,” అంటూ పంది ఎలాగో సర్దుకుంది. ఎలుక, కప్ప, గుడ్లగూబ, కుందేలు, నక్క, తోడేలుతో అది లోపల ఉంది. ఇది నిజం, మా బామ్మ చెప్పింది.





అసలు కష్టాలు ఇంకా ముందు ఉన్నాయి. చలికి ఒణుకుతూ ఒక పెద్ద ఎలుగబంటి అక్కడికి వచ్చింది.

అది ఏమీ అనక ముందే, “లోపల ఏమాత్రం చోటు లేదు,” లోపల ఉన్న జంతువులన్నీ అన్నాయి.



“ఇంకొక్కరికి చోటు లేకపోవటం ఏమిటి?” ఎలుగుబంటి అంది. అలా అని ఒక కాలు లోపలికి పెట్టింది, చేతితొడుగు మూలిగింది, రెండవ కాలు పెట్టేసరికి కొన్ని కుట్లు ఊడిపోయాయి. ఎలుగుబంటి ఊపిరి తీసుకుని మొత్తంగా లోపలికి దూరింది.



ఇది జరుగుతుండగా అక్కడికి ఒక నల్ల మిడత వచ్చింది. అది చాలా ముసలిది, చలికి దాని కీళ్లు బాగా నొప్పి పుడుతున్నాయి. చేతితొడుగుని చూసి,“లోపల వెచ్చగా ఉన్నట్టు ఉంది. నాకు కూడా చోటు దొరుకుతుందేమో చూస్తాను,” అనుకుంది ఆ మిడత.



ఆ మిడత మొదటి కాలు లోపల పెట్టిందో లేదో పటాక్ మంటూ కుట్లు అన్నీ ఊడిపోయాయి, తోలు ముక్కలయ్యింది, దానికి వేసిన మెత్తటి గుడ్డ పీలికలు అయ్యింది. లోపల ఉన్న జంతువులన్నీ మంచులో తలా ఒకవైపు పడ్డాయి!



ఒక చేతి తొడుగు పడిపోయిందని గుర్తించిన ఆ అబ్బాయి దానిని వెతుకుతూ అప్పుడు అక్కడికి వచ్చాడు. అయితే, దాని పీలికలు తప్పించి అతడికి ఏమీ కనిపించలేదు. నెత్తిమీద ఎర్రటి గుడ్డముక్కతో ఒక ఎలుక అటుగా వెళ్లినట్టు అతడికి అనిపించింది.

"బామ్మ కొత్త చేతితొడుగులు చేసి ఇస్తుందిలే," అనుకుంటూ తొడుగులేని చేతిని కోటులో పెట్టుకున్నాడు ఆ అబ్బాయి.

ఉత్తరపు చల్లగాలి చెంపలను కొరికేస్తుండగా అతడు ఇంటికి బయలుదేరాడు.



తన చేతితొడుగు ఏమయ్యిందో అతడికి ఎన్నటికీ తెలియలేదని మా బామ్మ చెప్పింది.

